## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ


గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి. కనుక తమవంతుగా భక్తి,జ్ఞాన ప్రచారార్ధం TTD(తిరుమల తిరుపతి దేవస్థానం) వారు ఉచితంగా విలువైన గ్రంధాలను ఆన్ లైన్ లో eBOOK(PDF) అందిస్తున్నారు. వారు చేస్తున్న జ్ఞాన యజ్ఞానికి సాయి రామ్ కూడా తమవంతుగా సహాయం చేసే కార్యక్రమంలో భాగంగా వారి గ్రంధాలను సాయి రామ్ ద్వారా కూడా అందచేస్తున్నాము, ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం చేసిన ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(www.google.co.in), మైక్రోసాఫ్ట్ సైట్ (www.microsoft.com) వారికి కూడా మేము ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇంట్లో ఆధ్యాత్మిక గ్రంధాలయం ఉండాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) TTD(తిరుమల తిరుపతి దేవస్థానం) వెబ్ సైట్: http://ebooks.tirumala.org
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సాయి రామ్ సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము.

**గమనిక:** భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో TTD(తిరుమల తిరుపతి దేవస్థానం) సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - **సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)**

* సర్వం శ్రీ సాయి నాథ పాద సమర్పణమస్తు *

## TTD(తిరుమల తిరుపతి దేవస్థానం)

## http://ebooks.tirumala.org

ebooks.tirumala.org

తిరుమల తిరుపతి దేవస్థానములు

Tirumala Tirupati Devasthanams

ePublications

Languages | Series | Authors | Archives | Saptagiri | Catalog | Contact US

: COMPLAINTS PLS CONTACT e MAIL saptagirittd@gmail.com CAN CALL 0877 226 4359, 4543,4360,4363, 4385 BETWEEN 10.30 AM AND 5.PM (DURING WORKING DAYS)

TELUGU (1197)
BANJARA (2)
ENGLISH (226)
SANSKRIT (70)
TAMIL (302)
KANNADA (175)
HINDI (181)

Saptagiri
Telugu Tamil Sanskrit Kannada Hindi English
Online Subscription

Panchangam
Telugu Tamil

Sri Bhagavad Ramanuja 'Sahasrabdi' Utsavam
Narada Bhakthi Sutra...

Maha Bharatham - Bhagavatham
Maha Bharatham Vol 1...
Potana Bhagavatam Vo...
Potana Bhagavatam Vo...
Potana Bhagavatam Vo...
Potana Bhagavatam Vo...

# అతి విశిష్టం ఈ దానం!

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, ఐవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

శ్రీనివాసబాలభారతి—33

S. Usha Rani

# సత్యభామ

రచన:

శ్రీమతి పి. అరవింద

ప్రధానసంపాదకుడు:

డాక్టర్ ఎస్. బి. రఘునాథాచార్య




ప్రచురణ:

శ్రీ జి. కుమారస్వామిరెడ్డి, ఐ. ఏ. ఎస్.,
కార్యనిర్వహణాధికారి
తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.
1983

T. T. D. Religious Publications Series No-164

SRĪNIVĀSA BĀLABHĀRATI - 33
( Children Series )

SATYABHĀMA
by Smt. P Aravinda

*Chief - Editor :*
Dr. S. B. Raghunadhacharya

First edition 1983

Copies : 10, 000

Price : 1-00

*Published by :*
Sri G. Kumaraswami Reddi, I.A.S.,
EXECUTIVE OFFICER.
Tirumala Tirupati Devasthanams,
Tirupati

Art :
Illustrations: } CHĀYA

Printed at :
Tirumala Tirupati Devasthanams Press, Tirupati.

# ముందుమాట

ఒకతోట అందంగా కనులకు విందుచేయాలంటే, ముందు అందులోని పూలమొక్కల్ని చక్కగా పెంచాలి. సమాజం సుందరంగా రూపొందాలంటే భావిభారతపౌరులైన బాలలు సంస్కారంతో పెరగాలి. మనసంస్కృతి గొప్పదనం వారికి తెలియనంతకాలం వారెన్ని విద్యలు సాధించినా ప్రయోజనం శూన్యం. "మహాపురుషులు మహాపతివ్రతలు మనజాతికెందుకు గర్వకారణమైనారు? వారినుంచి మనం ఏ ఆదర్శాన్ని నేర్చుకోవాలి?" అనే విషయాన్ని వారి కథను చెబుతూ మన చిన్నారి బాబులకు, పాపలకు చెప్పగలిగితే వారికి మనమెంతో సంస్కృతిసంపదనిచ్చిన వారమౌతాం. అలా సంస్కారంతో పెరిగిన - బాలలు, తమ జీవితంలో ఎంతో మంచిని పెంచుకొని ఈ సమాజానికి ప్రేమను పంచుతారు. ఉత్తమ పౌరులై వారి కుటుంబానికేకాక, ఈ దేశానికిగూడ పేరు ప్రతిష్ఠలను సంపాదిస్తారు.

తిరుమల తిరుపతిదేవస్థానం, ఇలాంటి ఉద్దేశ్యంతోనే ఈ "శ్రీనివాస బాలభారతి" అనే పుస్తకమాలను, చిన్నపిల్లలకోసం

ప్రకటిస్తున్నది. దీన్ని బాలభారతి అని పిలిచినా పెద్దవాళ్లకు గూడ ఎంతో విజ్ఞానాన్నందిస్తూ ఇది ప్రతికుటుంబాన్నీ ఆకర్షిస్తున్నది. చక్కని ఆదర్శం కలిగి, చరిత్రప్రసిద్ధి పొందిన మహాపురుషుల, మహాపతివ్రతల కథలు ఇందులో చిన్న చిన్న వాక్యాల్లో చెప్పడం జరుగుతుంది. ఈ బాలసాహిత్యాన్ని చిన్నారిపాపలు బాగా చదివి ఉపయోగించుకుంటారని ఆశిస్తున్నాను.

ఈ బాలసాహిత్యప్రణాళికను చక్కగా రూపొందించి, మంచి రచనలను తయారుచేయించి, అందరికీ అందుబాటులో ఉండేటట్లు సంపాదించిన డాక్టర్ ఎస్. బి. రఘునాథాచార్య (కో-ఆర్డినేటర్, పబ్లికేషన్స్, టి. టి. డి.) గారికి నా అభినందనలు. ఈ ప్రణాళికలో ఎందరో రచయితలు కళాకారులు సహకరిస్తున్నారు; వారందరికి నా ధన్యవాదాలు.

5—7—83

జి. కుమారస్వామి రెడ్డి, ఐ.ఏ.ఎస్.,
కార్యనిర్వహణాధికారి,
తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

# స్వాగతం!!

శ్రీనివాసదయోద్భూతా బాలానాం స్ఫూర్తిదాయినీ ।
భారతీ జయతాల్లోకే భారతీయగుణోజ్జ్వలా ॥

ఖండ ఖండాంతరాల్లో నాగరికత కన్నువిప్పేనాటికే సభ్యతకు సంస్కారానికి, నైతిక – ధార్మికాదర్శాలకు పేరుపడ్డది మన భరతఖండం. ఈ గడ్డపై పుట్టిన ప్రతిమానవుడు అధర్మాన్ని ఎదిరిస్తూ, ధర్మాచరణంలో తన జీవితాన్ని పండించుకొని, మాధవాభిముఖంగా నడచి మహనీయకీర్తినార్జించినవాడే. అలాంటి మహాత్ముల సన్నిధి మన సుఖసంతోషాలకు పెన్నిధి. కనీసం వారి జీవితాదర్శాలు మనస్సుల్లో మెదిలితే వాటి ప్రభావం మనమీద ఎంతో ఉంటుంది. 'నేను భారతీయుణ్ణి' 'ఇది తరతరాలనుంచి వస్తున్న నా సంప్రదాయం' 'ఇది నా కర్తవ్యం' అని ప్రతిబాలుడు బాలిక ఈ దేశసేవకు తనను అంకితం చేసుకుంటారు.

నిజానికి ఈ దేశంలో ఎందఱో మహానుభావులు మహాపురుషులు, మహాపతివ్రతలు, మహావీరులు పుట్టి, పెరిగి, చక్కని

సంస్కృతికి పునాదులు వేశారు. స్వచ్ఛమైన జీవనవాహినిని మన దాకా ప్రవహింపచేశారు. ఆహా! మనమెంత అదృష్టవంతులం! మనవెనుక ఎంత ఉదాత్తమైన చరిత్ర ఉంది. ఆ పుణ్యపురుషులు మహాసాధ్వులు ఇక్కడ పుట్టకపోతే మనదిగా మనం చెప్పుకొనే మహత్తరమైన ఈ సంస్కృతి, సభ్యత మనకెలా సంక్రమించేవి? వాళ్లను అర్థంచేసుకోవడం, వాళ్ల చరిత్ర మననంచేసుకోవడం వారి ఆదర్శాలు స్మరించడంకూడ మనకు గొప్ప విజ్ఞానాన్నందించే విద్యాభ్యాసం. అది ముందు ముందు మనజాతి జీవనప్రవాహంలో కొన్ని ఏండ్లదాకా చెక్కుచెదరని స్ఫూర్తిసౌరభాలను విరజిమ్ముతుంది. అందుకే శ్రీనివాసబాలభారతి ఉదయించింది. ఎందరో మహానుభావుల్ని మీ ముందుంచుతోంది. ఇక మీదే ఆలస్యం.

బాలలూ! రండి! రండి!

విందు మనస్సుతో మీ కిదే మా స్వాగతం!

5-7-1988

ఎస్. బి. రఘునాథాచార్య
ప్రధానసంపాదకుడు.

జీవితమనే నందనవనానికి వివాహమొక వసంతోదయం. ప్రణయాధిదేవత ప్రసన్నవదనం అందులో పూర్ణచంద్రోదయం.

ఆమె అసలే అందాలరాశి. అభిజాత్యంఆమెను అభిమానవతిని కూడచేసింది. అంతఃపురంలోని అంగనాలోకంలో ఆమె స్థానం అద్వితీయం. ఆమె ఆఁ అంటే; ఆయన ఊఁ కొట్టక తప్పదు. ఆమె ప్రణయం అలాంటిది. కాని ఉన్నట్టుండి ప్రళయం ముంచు కొచ్చిందొకనాడు.

కోపగృహంలో బుసలుకొట్టే ఆమె కోపాన్ని తగ్గించడానికి ఎన్ని తిప్పలుపడ్డాడో పాపం. ఉహుఁ ప్రయోజనం శూన్యం. ఇక పాదాభివందనమే శరణ్యమైంది. అయినా అందలేదా భామిని. ఎడమకాలితో ఆయన తలనొకపక్కకు తోసేసింది.

అమ్మో! ఎంతపని చేసింది!

సామాన్యుడు కాదాయన. ముల్లోకాలకు సన్మాన్యుడు వాసు దేవుడు. మరి ఆమె; శ్రీకృష్ణుని ప్రేమసర్వస్వంగా భావించుకున్న భామామణి సత్యభామ.

నాథుడైన యదునాథునితో కదనరంగంలో నిలబడి నరకుని అటకట్టించి స్త్రీజాతికే గర్వకారణమైన వీరవనితాలలామ ఆమె. దివిలోని పారిజాతవృక్షాన్ని తన పెరట్లో నాటించుకొని సవతులకు లేని సౌభాగ్యాన్ని చాటిచెప్పిన మేటి ఇల్లాలు. భగవంతుడు భక్తికే వశుడౌతాడనే సత్యాన్ని ఆలస్యంగానైనా తెలుసుకొని, తన జీవిత కుసుమాన్ని ఆయన పాదపద్మాలకే అంకితం చేసి, మాధవుడు సత్యభామాధవుడని నిరూపించిన ప్రేమామృతవాహిని ఆమె.

ఆమె సౌభాగ్యం, అభిమానం అవసరమైనంతవఱకు మన ఆడపడచులకు ఆదర్శంకావాలి.

— ప్రధానసంపాదకుడు.

# సత్యభామ

అందాలరాశి :

ప్రతిస్త్రీకీ తను చాలా అందంగా ఉండాలనీ, రకరకాల నగలూ బట్టలూ ధరించి అలంకరించుకోవాలనీ ఉంటుంది. తనని అందరూ గౌరవించాలనీ ఎవ్వరూ ఏమీ అనకూడదనీ అనిపిస్తుంది. అన్నిటికంటే ముఖ్యంగా భర్త ప్రేమ పూర్తిగా తనకే లభించాలనే కోరిక ఉంటుంది. కానీ ఇవన్నీ అందరికీ కుదురుతాయా? ఒక్క సత్యభామకి తప్ప.

సత్యభామ పేరు వినగానే అందంగా ఠీవిగా దర్పంగా ఉన్న రూపం ఒకటి కళ్లకి కనిపిస్తుంది. ఎవ్వరినీ లెక్క చేయని నిర్లక్ష్యం, భర్త తనుగీచిన గీత దాటడనే విశ్వాసం గర్వం ఆ ముఖంలో స్పష్టంగా కనిపిస్తాయి.

ఇంతకీ ఈ సత్యభామ ఎవరు? అబ్బో! చాలా బాగుంటుందిలెండి. ఎంత అందంగా ఉంటుందో! అందమైనది మాత్రమేనా? మంచికులంలో పుట్టింది, అభిమానవతి,

సంగీతంలో నిపుణురాలు. ఠీవీ, దర్పమూ ఈమె సొమ్ములు. అన్నింటినీ మించి భర్తప్రేమ చూరగొన్న సౌభాగ్యవతి ఈమె.

**జననం :**

సత్యభామ సత్రాజిత్తు కూతురు. సత్రాజిత్తు యాదవ కులంలో పేరు ప్రఖ్యాతులు పొందిన వ్యక్తి. చాలా మంచి వాడు. దైవభక్తి ఉన్నవాడు. సాటివారిలో చాలా గౌరవంగా ఉండేవాడు. ఇతని నిర్మలమైన ప్రవర్తనకు మెచ్చి సూర్యుడి తని స్నేహితుడయ్యాడు. లోకసాక్షి అయిన సూర్యుడు కూడా మెచ్చుకునే గుణాలున్నాయంటే ఎంతఉత్తముడు సత్రాజిత్తు! అల్లాంటి మహనీయుడి ముద్దుల కూతురు సత్యభామ. ఒక్కర్తే సంతానం సత్రాజిత్తుకి. ఈమె పుట్టుకతో లక్ష్మీకళ తాండవించిందాయింట్లో తల్లిదండ్రుల మురిపెపు బిడ్డగా పెరిగింది. బాల్యమంతా చాలా చక్కగా గడిచిందామెకి.

**విద్యాభ్యాసం :**

చిన్నప్పుడు బొమ్మల పెళ్లిళ్ళుచేస్తూ తన చెలులతో వియ్యం అందేది. అంతఃపురంలో బంగారు ఉయ్యాలల్లో

ఊగేది; సఖులతో బంతులాటలాడేది; ఉద్యానవనాల్లో తీగలని చెట్ల మీదకి పాకిస్తూ వాటికి కుదుళ్లు చేస్తూండేది. చక్కగా వీణవాయించుకుంటూ సాధనచేసుకునేది. చిలుకలకి పద్యాలు నేర్పుతూ నెమళ్లకి నాట్యం నేర్పుతూ ఉండేది. ఇల్లాగ ఆడుతూ పాడుతూ ఉల్లాసంగా గడపుతూండడమే కాక ఆయుధవిద్యలను కూడా అభ్యసించింది. యుద్ధవిద్యలో మంచినేర్పు సంపాదించిందికూడా. క్రమ క్రమంగా పెరిగి యౌవనవతయింది సత్యభామ.

కృష్ణుణ్ణే పెళ్లాడతాను :

ఈమె అందం అందరి కళ్లకూ మిరుమిట్లు కొల్పుతూ ఉండేది. వృష్ణివంశం వాళ్లయిన కృతవర్మ అక్రూరుడు శతధన్వుడూ మొదలయిన వాళ్లందరూ ఈమెని వివాహం చేసుకోవాలని ఉవ్విళ్లూరుతూ ఉండేవారు. తమ కామెనిచ్చి వివాహం చేయమని సత్రాజిత్తుని అడిగారు కూడాను. "అల్లాగే అల్లాగే" అంటూ వచ్చాడు సత్రాజిత్తు. కానీ తన అందాలబాలకి తగిన వరుడెవరా? అని ఆలోచిస్తూండే వాడతను. సత్యభామ మాత్రం చిన్నప్పటినుంచి కృష్ణుణ్ణే

వివాహంచేసుకోవాలని కోరుతూ ఉండేది. ఈమె పెళ్లికూడా చిత్రంగా జరిగింది.

**కోరిక ఫలించింది:**

సత్రాజిత్తు సూర్యుణ్ణి గూర్చి తపస్సు చేసి మెప్పించి "శమంతకం" అనే ఒక మణిని పొందాడు. అది చాలా మహిమకలది. రోజూ ఎనిమిది బారువుల బంగారాన్నిస్తూ ఉండేది. దాన్ని యాదవరాజు ఉగ్రసేనుడికిమ్మని కృష్ణుడడిగాడు. కానీ సత్రాజిత్తు ఇవ్వలేదు. ఒకరోజు సత్రాజిత్తు తమ్ముడు ప్రసేనజిత్తు దాన్ని ధరించి వేటకి వెళ్లాడు. ఒక సింహం అతణ్ణిచంపి ఆ మణిని తీసుకుపోయింది. ఆ సింహాన్ని చంపి జాంబవంతుడు ఆ మణిని తీసికెళ్లి తన కూతురు జాంబవతి కిచ్చాడు. ఈ సంగతి తెలియని సత్రాజిత్తు కృష్ణుడే తన తమ్ముణ్ణి మణికోసం చంపాడని అపవాదు వేశాడు. కృష్ణుడా అపవాదుని పోగొట్టుకోడానికి అడవిలో వెతుక్కుంటూ వెళ్లి జాంబవంతుణ్ణి పట్టుకుని అతని దగ్గరనుంచి మణినితెచ్చి సత్రాజిత్తుకిచ్చేశాడు. సత్రాజిత్తు చాలాసిగ్గుపడి పోయాడు అనవసరంగా కృష్ణుడిమీద అపవాదు వేసినందుకు. దానికి

పరిహారంగా తన కూతురు సత్యభామనీ శమంతకమణినీ కృష్ణుడికిచ్చాడు. కృష్ణుడు సత్యభామని స్వీకరించి వివాహం చేసుకున్నాడు ;కానీ మణిని తీసుకోలేదు. ఇల్లాగ తను చిన్న తనంనుంచీ కోరుకున్నట్లే శ్రీకృష్ణుడి భార్య అయింది సత్య భామ. కృష్ణుడి అష్టమహిషులలో ఒకర్తె సత్యభామ.

జన్మజన్మల తపస్సు:

కృష్ణుణ్ణి భర్తగా పొందాలన్న కోరిక ఈ జన్మది కాదు సత్యభామకి. పూర్వజన్మనుంచే ఈమె దీనికోసం తపస్సు చేస్తూంది. పూర్వజన్మంలో ఈమె దేవశర్మ అనే బ్రాహ్మడి కూతురు. దేవశర్మ అత్రికులంలో పుట్టినవాడు; సదాచార సంప న్నుడు. నియమనిష్ఠలున్నవాడు. ఈతని కూతురు గుణవతి. చాలా భక్తురాలు. ఎప్పుడూ వ్రతాలూ పూజలూ దానాలూ ధర్మాలు చేస్తూఉండేది. కార్తీకస్నానాలు చేసేది. తులసిని పూజించేది. ఉపవాసాలుండేది – చాలా నియమంగా ఇవన్నీ చేసేది. ఈ పూజలూ పునస్కారాలూ కృష్ణుడి భార్య అవా లన్న కోరికతోనే. ఆ పూజలన్నీ ఫలించాయి. మరుజన్మలో

ఈ గుణవతే సత్యభామగా పుట్టింది. దేవశర్మే సత్రాజిత్తుగా ఉద్భవించాడు. సత్యభామ కృష్ణుణ్ణి పెళ్లాడింది.

దెబ్బకు పై దెబ్బ:

సత్యభామని తమలో ఒకరికిచ్చి వివాహం చేస్తానని చెప్పి కృష్ణుడికిచ్చి పెళ్ళిచేసినందుకు అక్రూరుడికీ తక్కిన వాళ్లకీ కోపం వచ్చింది. దానికి ప్రతీకారంగా శతధన్వుడనే వాడు సత్రాజిత్తుని నిద్రిస్తుండగా చంపి అతని దగ్గరనున్న శమంతకమణిని అపహరించేశాడు. సత్యభామకి తండ్రి మరణం చాలా బాధకలిగించింది. చాలా కోపం తెప్పించింది కూడా శతధన్వుడు చేసిన పని. ఆమెకి చాలా పౌరుషమూ పట్టుదలాను. సత్రాజిత్తు మరణసమయంలో కృష్ణుడక్కడ లేడు. పాండవులదగ్గరకి వెళ్లాడు. సత్యభామ తండ్రి శరీరాన్ని జాగ్రత్త పెట్టింది. వెంటనే రథమెక్కి కృష్ణుడి దగ్గరికి వెళ్ళి జరిగినదంతా చెప్పింది. తండ్రిమరణం ఎంతటివాళ్లకయినా బాధ కలిగిస్తుంది కదా! కృష్ణుడామెను ఓదార్చి వెంటనే వచ్చి శతధన్వుణ్ణి సంహరించాడు.

సత్యా ః నువ్వు కాస్సేపు యుద్ధం చెయ్యి ః

తండ్రియింట్లో చాలా కట్టుదిట్టంగా పెరిగినా మంచి ధైర్యసాహసా లబ్బాయి ఈమెకి. యుద్ధాలు చేయడమంటే ఈమెకెంతో సరదా. నరకుడితో యుద్ధం చేసిందీమె. నరకాసురుడు పెట్టే బాధలు భరించలేక మునులూ దేవతలూ అందరూ కృష్ణుడితో మొరపెట్టుకున్నారు. అతన్ని సంహరించడానికి కృష్ణుడు బయలుదేరాడు. ఇలాంటి సమయం వదలుకుంటుందా యుద్ధాలంటే ఇష్టపడే సత్యభామ ? తనూ కృష్ణుడితో బయలుదేరింది. అక్కడ నరకుడి సైన్యాలకీ కృష్ణుడికీ భయంకరయుద్ధం జరిగింది. సైన్యమంతా నశించి పోయింది. అప్పుడొచ్చాడు నరకుడు యుద్ధానికి. నరకుడికీ కృష్ణుడికీ ఘోరయుద్ధం జరిగింది. ఆ యుద్ధంలో నరకుడి బాణమొకటి కృష్ణుడి నుదుటిమీద గాఢంగా నాటింది. గట్టిగా గుచ్చుకుందన్నమాట. అది తగలగానే కృష్ణుడు మూర్ఛ పోయాడు. ముఖమంతా రక్తం కమ్మేసింది. అది చూసి సత్యభామ ఏం చేసింది ? గడగడ వణికిపోయిందా ? ఊహూ ! ఆ బాణాన్ని నెమ్మదిగా లాగేసింది. ముఖంమీదున్న రక్తమంతా చక్కగా తుడిచింది. చల్లనిగాలి తగిలేలాగ విసిరింది.

అతణ్ణి తేరుకునేలా చేసింది. కృష్ణుడు అలసటతీరి నవ్వుతూ "సత్యా! నేను చాలా అలసిపోయాను. కాస్సేపు ఈ ధనుర్బాణా లందుకొని నువ్వు యుద్ధం చెయ్యి!" అన్నాడు. సత్యభామ కెంత సంతోషం కలిగిందో? వెంటనే యుద్ధానికి సిద్ధమైంది. జుట్టు గట్టిగా ముడివేసింది. పయటకొంగు నడుముచుట్టూ తిప్పి బిగించింది. ధనువునీ బాణాలనీ అందుకుంది. వీణ తీగల్ని ప్రయోగించే వేళ్లతో అల్లెత్రాటిని ప్రయోగించింది. ప్రారంభించింది యుద్ధం.

**శృంగారవీరరసాధిదేవత ఈమె:**

నరకుడు వేసే బాణాలనన్నిటినీ అవలీలగా ఖండిం చేస్తోంది సత్య. తను ప్రయోగించే బాణాలతో అతణ్ణి హడల గొట్టేస్తోంది. యుద్ధంచేస్తున్న సత్యభామముఖం కోపంతో రోషంతో సూర్యబింబంలా అగ్నిజ్వాలలా వెలిగిపోతూ నరకుడికి కోపం కలిగిస్తుంది. ఆ ముఖమే చంద్రబింబంలా అమృత ప్రవాహంలా ప్రకాశిస్తూ కృష్ణుడికి సంతోషాన్ని కలిగిస్తూంది. అప్పుడామె వీరశృంగారరసాలు రూపం పొందినట్లుగా కని పిస్తూంది. ఆమె ఆకారం చూస్తూంటే నరకుడికి వణకూ,

కృష్ణుడికి గర్వమూ కలిగాయి. దేవతలందరూ ఈ యుద్ధాన్ని చూసి ఆశ్చర్యపోయారు. మెచ్చుకున్నారు. మగవారిని చూసి చాటుకివెళ్ళే సత్య శత్రువు నెట్లా గెలువగలిగింది? ఉయ్యాలలెక్కడానికి భయపడే ఆమె గరుడునివీపుమీద ఎలా ఎక్కింది? పదిమాటలకొకమాట పలికే భామ సింహగర్జన లెలా చేసింది? వరుసగా ముత్యాలు కూడా కూర్చలేని వనిత అల్లె త్రాటినెలా సంధించింది? అనుకున్నారు అందరూ. కృష్ణు డామె చేసిన యుద్ధంచూసి ముగ్ధుడయ్యాడు. ఇదివరకెంద రడిగినా ఇవ్వని తనమెళ్లోని మణిహారాన్ని ఆమెకి బహుమాన మిచ్చాడు. తన చక్రాయుధంతో నరకుణ్ణి సంహరించేశాడు. సత్యభామ ఎంతశౌర్యమూ ధైర్యమూ కలదో! ఇలాగ ధైర్యంగా ఉండి పరాక్రమం చూపగలిగిన స్త్రీలనే 'వీర వనితలు' అంటారు.

ఈమె చెప్పినదెలా వింటున్నారు?

ఇలాగ యుద్ధాలకి వెళ్ళినప్పుడు కూడా భర్తని విడిచి ఉండడం ఇష్టంలేని సత్యభామకి అతనికి ఎంతోమంది భార్య లుండడం చాలా చికాకుగా ఉండేది. ఎప్పు డెక్కడుంటాడో

తెలియదు. తనదగ్గరే ఎప్పుడూ ఉండడానికి వీలవదు. అందుకే సత్యభామ వీలయినంతవరకూ కృష్ణుణ్ణి తన చెప్పు చేతల్లో ఉంచుకోవడానికి ప్రయత్నిస్తూండేదెప్పుడూ. ఒక మాటు ధర్మరాజు రాజసూయయాగం చేశాడు. యాగమంటే పెద్దపూజన్నమాట. దానిని చూడడానికి కృష్ణుడూ సత్యభామా వచ్చారు. అక్కడున్నంతసేపూ ఒకవిషయాన్ని గమనించిందావిడ. ఏమిటిదీ! ద్రౌపది భర్తలైదుగురూ అంటే పాండవులయిదుగురూ ఆమె చెప్పినట్లెలా వింటున్నారు? ఇది చాలా ఆశ్చర్యం కలిగించింది సత్యభామకి. "ఇదేమిటి! కృష్ణుణ్ణి ఒక్కణ్ణే నా మాట వినేలా చేసుకోలేకపోతున్నానే! ఈ అయిదుగురూ ఈమె చెప్పినట్లెలా వింటున్నారు చెప్మా!" అని ఆశ్చర్యపోయింది. ఆ మాటే అడిగింది ద్రౌపదిని.

ఏం మంత్రం వేశావు వదినా?

"ఏమమ్మా! వదినా! నేను వచ్చినప్పటినుంచీ చూస్తున్నాను, నీ భర్తలందరూ నీ కనుసన్నల్లో మెలగుతున్నారు. ఒక్కడే నాకు లొంగడంలేదే, ఇంతమందీ నీ మాటెలా వింటున్నారమ్మా? ఏదయినా మందు పెట్టావా? లేక మంత్రమేదైనా

వేశావా? నాక్కూడా చెప్పుదూ కాస్త ఆ ఉపాయం" అని అడిగింది. అప్పుడు ద్రౌపది కొంచెం బాధపడి "తప్పు తప్పు; అలా మందులూ మాకులూ ఎన్నటికీ పెట్టకూడదు సుమా! నేను నా భర్త లైదుగురి దగ్గరా చాలా భయభక్తులతో ఉంటాను. అందుకే వాళ్లుకూడా నేను చెప్పినట్లల్లా వింటారు. అంతేకానీ నేనేమీ మందులూ మాకులూ పెట్టడంలేదు" అంది. కృష్ణుడు తనకే లోబడి ఉండేలా చేసుకోవడానికి యింత తాపత్రయం ఈవిడకి.

### ఎవరూ తనతో పోటీ పడకూడదు:

కృష్ణుడంటే ఈమెకి వెర్రి ప్రేమ. అతడు తనదగ్గరే ఉండాలనీ తనతోనే ఆడుతూ పాడుతూ సరదాగా కాలక్షేపం చేయాలని అనుకుంటూ ఉండేది. ఎన్నోరకాలుగా కృష్ణుడితో కలిసి సంతోషంగా ఉన్నా ఎప్పుడయినా అతడు తన ఇంటికి రావడం ఆలస్యమైతే ఎంతో బాధపడిపోయేది. తనకి చూపకుండా తన సవతులకి ఏ బహుమానమయినా కృష్ణుడివ్వడం ఈమెకిష్టం ఉండేదికాదు. తనతో వాళ్ళెవరూ పోటీకిరావడం సహించేది కాదు. ఇవన్నీ చూసి అందరూ ఈమెకి అసూయ

గర్వమూ చాలా ఎక్కువని అనుకుంటూ ఉంటారు. కృష్ణుడి మీదున్న విపరీతమైన ప్రేమతో, అతడు తనచెయ్యి దాటి పోతాడేమో అన్న భయంతో ఈమె యిలా ప్రవర్తించేది.

ఇంతకంటే సౌభాగ్యమేముంటుంది?

కృష్ణుడుకూడా ఈమెమాట సరదాకయినా, ఆఖరికి కలలోనయినా కాదనే వాడుకాదు. యుద్ధానికయినా ఆమెను విడిచి వెళ్ళేవాడు కాడు. ప్రాణానికి ప్రాణంగా చూసుకొనే వాడు. ఆమె కోరికలన్నీ తీర్చేవాడు. ఈమెకిచ్చినంత చనువు ఒక్క రుక్మిణికి తప్ప మరెవ్వరికీ యిచ్చేవాడు కాదు. చెలికత్తెలు తనమీద ఏమినేరాలు చెప్తారో అని వాళ్ళకి లంచాలిచ్చేవాడు. బంధువులందరూ ఈమె అదృష్టాన్ని మెచ్చుకునే వారు. సవతులందరూ తమకా అదృష్టం లేనందుకు సిగ్గుపడే వారు. కృష్ణుడీమె నింతగా ప్రేమించడం చూసి, ఈమె ఠీవీ దర్పమూ చూసి వాళ్ళంతా ఈమెవేపు కన్నెత్తి చూడడాని కయినా జంకేవారు. భర్తప్రేమని ఇంతగా పొందడంకంటే సౌభాగ్యమేముంటుంది స్త్రీకి?

ఆమెగర్వం అణగిపోతుంది:

కృష్ణుడు సత్యభామతోపాటు రుక్మిణినికూడా చాలా గౌరవించేవాడు. ఈ ఇద్దరూ "మేమే కులమూ రూపమూ భర్త ప్రేమా కలిగినవాళ్ళమంటూ గొప్పలుపోతూ ఒకర్ని చూసి ఒకరు ఈర్ష్యపడుతూ ఉండేవారు. సత్యభామ ఎప్పుడూ రుక్మిణితో వంతులు పోతుండేది. తక్కినవారిమెకి లెక్కలేదు. ఇలా ఉంటుండగా ఒకమాటు ఏమయిందంటే — కృష్ణుడు రుక్మిణీదేవి యింట్లో ఉండగా నారదుడు ఒకపువ్వుని తీసుకు వచ్చి కృష్ణుడికి బహుమానమిచ్చాడు. ఆపువ్వుని "పారిజాతం" అంటారు. చాలామహిమ ఉన్న పువ్వది. కృష్ణుడు దానిని సత్యభామకి పంపిద్దామా అనుకొని అలా పంపితే రుక్మిణి చిన్నపుచ్చుకుంటుందని ఆమెకిచ్చాడా పువ్వును. నారదుడు కలహభోజనుడు కదా! పువ్విచ్చి ఊరుకున్నాడా? లేదు. "నేనే చక్కనిదాన్ననీ, యవ్వనవతిననీ, లోకంలో ప్రసిద్ధి పొందినదాన్ననీ, నేనంటేనే నాభర్తకి ఎక్కువప్రేమ అనీ విర్రవీగుతుంటూంది సత్య. ఎవర్నీ లెక్కపెట్టదు. ఇప్పుడు కృష్ణుడు పువ్వు నీకివ్వడంతో ఆమె గర్వమంతా అణిగి పోతుంది" అన్నాడు రుక్మిణితో. ఈ మాటలన్నీ చాటున ఉండి

వింటూన్న సత్యభామ చెలికత్తె పరుగుచ్చుకుంది, ఆమె కివన్నీ చెప్పడానికి.

మాట్లాడకుండా ఊరుకున్నాడు :

ఆ సమయంలో సత్యభామ తనచెలికత్తెతో ఉద్యాన వనంలో కూర్చుని కృష్ణుడి గుణగణాలన్నీ వర్ణించి చెప్తూంది. ఇంతలో ఆమెకుడికన్ను అదరడం మొదలుపెట్టింది. ఆడ వారికి కుడికన్ను అదిరితే మంచిదికాదు కదా! కృష్ణుడింకొక భార్యతో కలసి తనని చిన్నచూపు చూసి నిర్లక్ష్యం చేస్తున్నా డేమో అని అనుమానించిందామె. అంటే అన్నిటికంటే కృష్ణుడు తనని నిర్లక్ష్యం చేయడమే పెద్దదురదృష్టమన్న మాట ఆమెకి. ఇలా కలవరపడుతూండగా వచ్చింది చెలికత్తె రుక్మిణియింట్లో జరిగిన విషయాలన్నీ పూసగ్రుచ్చినట్లు చెప్పింది. నారదుడన్న మాటలన్నీ కూడా చెప్పింది. ఇవన్నీ వింటూ కృష్ణుడుమాట్లాడక ఊరుకున్నాడనికూడా చెప్పేసింది. రుక్మిణీ ఆ పారిజాతాన్ని తలలోపెట్టుకుని తెగ వగలు పోయిందనీ చెప్పింది.

గోపాలుడెంత కపట ప్రేమ నటించాడు?

ఇంకేముంది తోకతొక్కినతాచులా లేచింది సత్యభామ. నెయ్యివోస్తే భగ్గుమన్న మంటలా మండిపడిందామె. సత్య ఆత్మాభిమానం దెబ్బతిన్నది. తనని ఎవరయినా ఏమయినా అంటే ఎంతమాత్రమూ సహించదామె. అందులో ఇప్పుడు జరిగింది ఇంతా అంతా అవమానమా? నారదుడు మహా గొప్పదని చెప్పి ఒకపువ్విస్తే ఇచ్చాడు. కృష్ణుడది తనకిష్టమైన వారికిచ్చుకుంటే ఇచ్చుకున్నాడు. మధ్య తనమాటెందుకు తలపెట్టాలక్కడ? అందులోనూ తన సవతియింట్లో? ఆ మాట లన్నీ వింటూ కృష్ణుడూరుకోవటమా? ఇంతకంటే అవమానం ఇంకోటి ఉందా? తన ప్రాణంకంటే ఎక్కువ అనుకుందే కృష్ణుణ్ణి. అతనే ఇలా ప్రవర్తిస్తే ఒళ్ళు మండదూ! ఇక తన సవతులందరికీ తను చులకనైపోదూ! అత్తగారు దేవకీ దేవి సేవచేయడానికి తనే ముఖం పెట్టుకుని వెళ్తుందింక? ఛీ ఛీ ఇంత అవమానం జరిగినా తన ప్రాణం పోలేదేం? అనుకుంది సత్య- ఒకపువ్వు రుక్మిణి పెట్టుకున్నంత మాత్రాన తమ గౌరవమూ అభిమానమూ విడిచిపెట్టి సవతులందరూ ఆమెను సేవించడానికి వెళ్లారని విని చాలా అసహ్యించుకుంది

ఆమె. మానవతిఅయిన సత్యభామకి వాళ్లు చేసినపని చాలా నీచంగా తోచింది. ఇన్నాళ్లూ రుక్మిణిమీద ఉన్న ప్రేమని దాచి తనమీద ప్రేమున్నట్లు నటించాడు కృష్ణుడని బాధపడిందామె. పువ్వు తన కివ్వకుండా రుక్మిణి కిచ్చాడన్న ఉక్రోషమూ, కృష్ణుడు తనకి దూరమైపోతున్నాడేమో అన్న బాధా ఈమెను నిలువనీయకుండా చేశాయి. ఔను మరి! ఎవరయినా సహించగలరా, ఇంతటి అవమానాన్ని? అందులో సత్యభామ.

**ఇంత అవమానం జరిగాక నిద్రెలా పడుతుంది?**

కృష్ణుడు తనని వంచించాడనుకునేటప్పటికి సత్యభామకి చాలా కోపం వచ్చేసింది. మాసినచీర కట్టుకుంది! నగలన్నీ తీసేసింది. తలకి వాసినకట్టు కట్టుకుంది. నల్లటి బొట్టు పెట్టుకుంది. చందనంచెట్టు తొఱ్ఱలోకి వెళ్తున్న నాగు పాములా కోపగృహంలో ప్రవేశించింది. ఆ చీకటింటిలో మూలగా ఉన్న మంచంమీద ముసుగుతన్ని పడుకుంది. (ఆ గదిని కోపగృహం అంటారు. పూర్వం మహారాణులు కోపం వచ్చినప్పుడు. అలాంటి చీకటిగదిలో పడుకునేవారట. దాన్నిబట్టి వారికి కోపంవచ్చిందని తెలిసేదట) పడుకుందన్న

మాటేకానీ సుఖంగా నిద్రపోయిందా? కోపంతో అభిమానంతో ఉడికిపోతూంది కదా, నిద్రెలా పడుతుంది? పడుకుంటుంది. లేస్తుంది. మంచంమీద ఇటూ అటూ దొర్లుతుంది. కళ్లు తెరుస్తుంది, మూస్తుంది. ఉస్సురుమని నిట్టూరుస్తుంది. ఆమె కేమీ స్తిమితంగాలేదు. మనస్సంతా ఆవేశంతోనూ, ఉడుకు మోత్తనంతోనూ, భయంతోనూ, దుఃఖంతోనూ అల్లకల్లోలంగా ఉంది. అప్పుడు సత్యభామ, ఏనుగు తన తొండంతో లాగేసి చిందరవందర చేసిన తామరతూడులా ఉంది.

**ఇల్లు చిన్నపోయింది :**

అక్కడ కృష్ణుడు రుక్మిణికి పువ్విచ్చాడే కానీ హడలి పోతూనే ఉన్నాడు. చాటున ఉండి అన్నీ చూసిన చెలికత్తె తనమీద ఏమేమి కల్పించి చెప్పిందో అనీ, అవన్నీ విన్న సత్యభామ ఎంత అలిగిందో అనీ. అతని మనస్సంతా విచారంతో నిండిపోయింది. నారదుడికి చేయవలసిన మర్యాద లన్నీ చేసి అతనిని చూసుకోమని ప్రద్యుమ్నునికి అప్పగించి రథమెక్కి గబగబా సత్యభామయింటికి బయలుదేరాడు. రథం చాలా వేగంగా వెళ్తూంది. రథానికి కట్టిన జెండాగుడ్డ

లాగ అతనిధైర్యం చలించిపోతూంది. నిలవడం లేదు. పరుగెత్తుతూన్న గుఱ్ఱాలను మించిపోతూంది అతని తొందర పాటు. రథచక్రాలను మించి తిరిగిపోతూంది అతని మనస్సు. ఏం జరుగుతూందో అక్కడ అన్న కంగారుతో సత్యఇంటి ముందాగింది రథం. సారథిని గుమ్మంలోనే ఉండమని చెప్పి తనొక్కడే లోపలికెళ్లాడు కృష్ణుడు. ఏముంది? అనుకున్నంతా అయింది. ఇల్లంతా నిశ్శబ్దంగా ఉంది. ఎప్పుడూ శ్రావ్యంగా సంగీతధ్వనులు వినిపిస్తూ ఉండేవి ఇంట్లో. ఇప్పుడు చెలులు వీణలని మీటి పాడడం లేదు. బంగారుపంజరాల్లో ఉన్న గోరువంకలు పద్యాలూ అవీ చదువుతుండేవి. ఇప్పుడు చక్కెర పెట్టి వాటిని చదివించడం లేదెవ్వరూ. నెమళ్లు అందంగా పింఛంవిప్పి నాట్యం చేస్తుండేవి. ఇప్పుడు చేతులతో తాళం వేస్తూ చెలులెవ్వరూ వాటిని ఆడించడం లేదు. అందంగా పయ్యారంగా హుందాగా నడిచి ఎదురొచ్చేవి రాజహంసలు. వాటికెవ్వరూ నడకలు నేర్పడం లేదిప్పుడు. ఇంట్లో ఎక్కడా చడీచప్పుడూ లేదు. చెలికత్తెలంతా బిక్కుబిక్కుమంటూ తలోమూలా ఉన్నారు. ఇల్లంతా చిన్నబోయింది. సత్యభామ యింటి యజమానురాలు కదా! ఆమె కోపంతోనూ, దుఃఖం

తోనూ అలా బాధపడుతూంటే వాళ్ళందరూ భయంతో బిగుసుకుపోయారు.

ధూర్త గోపాలుని కపటోపచారాలు:

కృష్ణుడు సత్యభామకోసం ఇల్లంతా వెతికాడు. ఎక్కడా లేదామె. కోపగృహంలో ఉందని తెలుసుకున్నాడు. చెలులంద రికీ-కొందరికీ సైగచేసి, కొందరిని బెదిరించీ తనొచ్చినట్లు సత్యకు చెప్పవద్దని చెప్పాడు. కోపగృహంలోకెళ్లాడు నెమ్మదిగా, అక్కడ మండుటెండకి వాడిపోయిన తీగలా కనిపించింది సత్యభామ. ఈవిడ సంగతేమిటో కాస్త చూద్దాం అనుకున్నాడు పిల్లిలా అడుగులో అడుగువేసుకుంటూ మంచందగ్గరకివెళ్లాడు. అక్కడొక చెలికత్తె సత్యభామకి విసురుతూంది. ఆమె చేతి లోంచి చప్పుడు చేయకుండా చామరం తీసుకొని తను విసరడం మొదలుపెట్టాడు నెమ్మదిగా. ఇంతకుముందు కృష్ణుడు పారిజాతపుష్పాన్ని కాస్సేపు పట్టుకున్నాడు కదూ! దాని వాసన అతనికి బాగా అంటింది. ఇప్పుడు విసురుతుంటే ఆ సువాసన గదంతా వ్యాపించింది. ఇదేం వాసన? కొత్తగా ఉందే! అనుకుంటూ తలెత్తి గది నాలుగుమూలలా చూచింది

సత్య. ఎదురుగుండా విసనకర్ర పట్టుకుని మాయలమారి కృష్ణుడు. అతన్ని చూడగానే ఆమెకు ఎక్కడలేని దుఃఖం, ఉడుకుమోత్తనం వచ్చేశాయి. గబుక్కున మళ్ళీ ముసుగు పెట్టేసుకుంది. కళ్ళల్లోంచి జలజలా నీళ్ళు కారిపోతున్నాయి.

**ఎడమకాలితో ...**

సత్యభామ అలాగ బాధపడుతూంటే కృష్ణుడికి చాలా జాలేసింది. ఆమెను బతిమాలడం మొదలుపెట్టాడు. "సత్యా! నగలన్నీ తీసేసి యీ మాసినచీర కట్టుకున్నావేం? నాతో మాట్లాడడం లేదేమి? ముఖమంతా ఇలాగ వాడిపోయిందేం? నీ సంగతేమిటో కొత్తగా ఉంది. నా మనసు తెలుసుకోదలచి ఇలాగ ఉన్నావా? లేక వేళాకోళానికా? నన్ను భయపెట్ట డానికా? నిజంగానే నామీదకోపం వచ్చిందా? నేనేమయినా తప్పు చేశానా? అందరికంటే నిన్నే నే నెక్కువప్రేమతో చూస్తానుకదా! ఇప్పుడేమయింది? నామీద నీకెవరేంచెప్పారు? ఎందుకీ దుఃఖం? నాతో మాట్లాడకపోతే పోయావు పోనీ—నా వేపైనా చూడకూడదా?" అంటూ ఏమీతెలియనట్లు ఎంతో బతిమాలాడు కృష్ణుడు. కానీ ఆమెకోపం పోలేదు. ఇక ఆమె

కోపాన్ని ఏ రకంగానూ తగ్గించలేక చిగురుటాకుల్లా మెత్తగా ఉన్న ఆమెపాదాలకి తలవొంచి నమస్కరించాడు కృష్ణుడు. అప్పుడు —

జలజాసన వాసవాది సురపూజాభాజనంబై తన
ర్చులతాంతాయుధు కన్నతండ్రి శిరమచ్చో వామపాదంబునన్
దొలగంద్రోచె లతాంగి, యట్లయగు నాథుల్నేరముల్సేయఁ, వే
రలుకం జెందినయట్టి కాంతలుచిత వ్యాపారముల్నేర్తురే?

కృష్ణుడంటే ఎవరు? మానవావతారం ఎత్తిన దేవుడు! బ్రహ్మ, ఇంద్రుడు మొదలైన దేవతలతణ్ణి పూజిస్తుంటారు. అలాంటి భగవంతుని తలని సత్య ఎడమకాలితో అవతలకి తోసేసింది ఆవిడ ఆత్మాభిమానం అలాంటిది.

నీపాదం నొప్పిపెట్టిందేమో?

తనని తన్నినందుకు కృష్ణుడు కోపగించుకోలేదు సరికదా! ఆమెపాదం నొప్పిపెట్టిందేమో అని బాధపడ్డాడు. ఆమాటే అన్నాడామెతో. "చూడు సత్యా! నీ దాసుణ్ణి నన్ను ప్రణయకోపంతో తన్నితే తన్నావు. నాకది గౌరవమే. కానీ నీ పాదం నొప్పిపెట్టిందేమో అని బాధపడుతున్నాను నేను

ఇకనైనా నామీద కోపం మానవా?" అని మళ్లీ ప్రాధేయ పడ్డాడు.

నిన్నునమ్మి మోసపోయాను:

అప్పుడు సత్యభామ రోషంతో పక్కమీదనుంచి లేచింది. కోపంతో ముఖమంతా చిరుచెమట పట్టేసింది. ఆమె పెదిమలు వణుకుతూండగా అంది కృష్ణుడితో. ఈ యిచ్చకాల మాటలూ ఈ నయగారపు ప్రియాలూ ఎందుకు? నిన్ను నమ్మినందుకు మంచిప్రతిఫలం కలిగింది నాకు. మాబాగాచేశావులే. ఇదివరకు నమ్మినట్లు ఇంకా నిన్ను నమ్ముతాననుకున్నావేమో! ఈ కల్లబొల్లి మాటలన్నీ రుక్మిణీదేవికి నచ్చుతాయేమో కానీ నాకు నచ్చవుసుమా! అనవసరంగా నన్ను ఊడికించి రెచ్చగొట్టకు. లేనిపోని ప్రేమలు చూపించకు. ఈ అల్లరి వేషాలూ, నేర్పరితనాలూ నువ్వుపుట్టాక పుట్టాయి. ఈ మాయవేషాలన్నీ నీకు వెన్నతోపెట్టిన విద్యలని తెలిసీ నిన్నునమ్మి మోసపోయాను. అసలు నువ్విక్కడికి ఎందుకు వచ్చినట్లు? నారదుడిచ్చిన పువ్వుని నీకు ప్రియమైన వాళ్లకి ఇచ్చుకున్నావు కదా! ఆ పారిజాతపువాసనలు ఇక్కడ చూపించి నన్ను వెక్కిరించడానికికదూ నువ్విక్కడికి వచ్చింది?

**అభిమానమే స్త్రీలకి అలంకారం :**

నే నీ అవమానాన్ని సహిస్తాననుకున్నావేమో! అభిమానమే స్త్రీలకి అలంకారం. అది ప్రాణంకంటే కూడా ఎక్కువైంది. అన్ని గౌరవాలకీ అదే మూలకారణం. అభిమానం లేని బ్రతుకెందుకు? నా సవతులు నన్ను చూసి వవ్వేకముందే నావంతం చూపిస్తాను—చూద్దువుగాని. అందరిలాంటిదాన్ననుకున్నావేమో! నేనెవతె ననుకున్నావు?" అంటూ భరించలేని దుఃఖంతో ఈర్ష్యతో నోటమాటరాక ఏడ్చేసింది సత్య.

**ఒక్క పువ్వేమిటి? పారిజాతవృక్షమే తెస్తాను :**

అప్పుడు కృష్ణుడు ప్రేమతో ఆమెను దగ్గరకి తీసుకుని బుజ్జగించి కన్నీరు తుడుస్తూ ఓదార్చేడు. "అయ్యయ్యో! ఒక పువ్వుకోసమేనా నేనుండగా ఇంత బాధపడుతున్నావు? నందనవనంలో ఉన్న పారిజాతం చెట్టునే తెచ్చిపెడ్తాను చూడు నీకు. చక్కగా నీ ఉద్యానవనంలో నాటిస్తాను. ఒక్క పువ్వేమిటి? అప్పుడు పువ్వులన్నీ నీవేలే. ఇంక బాధపడకు" అన్నాడు. ఆ మాట సత్యభామ చెవిలో అమృతం పోసినట్లయింది. ఆమె వంతం తీరింది. కృష్ణుడికి తనమీద ప్రేమ

పోలేదని ధైర్యం కలిగింది. రుక్మిణికి ఒకపువ్వే యిచ్చాడు. తనకి చెట్టే తెచ్చిపెడ్తాడని తృప్తిపడింది. ఇక సవతులముందు తనకవమానంలేదు అని స్థిమితపడింది. అభిమానధనురాలు కనకనే తనపంతం పూర్తిగా నెగ్గేవరకూ తీరుకోలేదు. సత్య కృష్ణుడిప్రేమ పూర్తిగా తన మీదే ఉందని నమ్మకం కలుగ గానే ఆమె మనసు పురివిప్పిన నెమలిలా నాట్యం చేసింది. తమ ప్రియసఖి సంతోషాన్ని చూసి చెలులందరూ ఆనందంతో చెలరేగారు. ఇల్లు మళ్ళీ కళకళలాడింది. కృష్ణుడు సరదాగా రకరకాల కబుర్లు చెప్పి హాస్యాలాడి సత్యభామ మనస్సును సంతోషంతో తృప్తితో నింపేశాడు.

కొత్తగా ఏమని దీవించను?

ఇంతలో మధ్యాహ్నమయింది. స్నానానికి సిద్ధమ య్యాడు కృష్ణుడు. సత్యభామ వెంటనే స్నానానికన్నీ అమర్చమని చెలులని పురమాయించింది. పన్నీటితో స్నానం చేశాడు కృష్ణుడు. సత్యభామ కూడా స్నానంచేసి చెంగావి చీరకట్టి రత్నాలంకారాలు ధరించి, పువ్వులలంకరించుకుని బంగారపు అందెలు మ్రోగుతూండగా భర్తదగ్గరకి వచ్చింది

ఈర్ష్య, కోపం, సంతాపం అనేవేమీ లేకుండా నిర్మలమైన మనస్సుతో కళకళలాడుతూవచ్చిన సత్యనుచూచి కృష్ణుడెంతో సంతోషించాడు. ఇంతలో నారదుడక్కడికి వచ్చాడు. అతని కతిథి సత్కారాలు చేశారు సత్యాకృష్ణులు. తరువాత నారద మునితోనూ సోదరులతోను బంధువులతోను కలసి పంచభక్ష్య పరమాన్నాలతో భోజనం చేశాడు కృష్ణుడు. సత్యభామ అంద రికీ పచ్చకర్పూరపు తాంబూలాలిచ్చింది. అంతఃపురంలో చేయవలసిన పనులన్నీ చేసుకుని భర్త దగ్గరకివచ్చి అక్క డున్న నారదుడికి నమస్కరించింది. అప్పుడతడు, "నిన్నిప్పుడు కొత్తగా ఏమని దీవించను? ఎక్కడయినా నీలాంటి వైభవసౌభాగ్యాలున్న స్త్రీలున్నారా? నీకు లోటేమిటి? అయినా దీవించాలి కనుక దీవిస్తున్నాను. నీభర్త నీవుకోరిన కోరిక లన్నీ, అవి ఎలాంటివైనా సరే తీరుస్తూ ఉండుగాక!" అని ఆశీర్వదించాడు. తరువాత ఇక నేను వెళ్లివస్తానని కృష్ణుడి దగ్గర సెలవు తీసుకున్నాడు. కృష్ణుడు "తాను త్వరలో స్వర్గానికి వస్తున్నానని ఇంద్రుడికి చెప్పమని" చెప్పాడు నారదుడితో.

చుట్టంగా వచ్చి ఇదేం మర్యాద?

ఆ రోజు గడచిపోయింది. మరునాడు బంధుమిత్రుల కందరికీ చెప్పి స్వర్గానికి ప్రయాణమయ్యాడు కృష్ణుడు గరుత్మంతుణ్ణి రప్పించాడు, సత్యభామతో ఆ వాహనం మీద ఎక్కాడు. పారిజాతాన్ని తీసుకురావడానికి బయలుదేరాడు. దారిపొడుగునా ఉన్న పర్వతాలనీ, నదులనీ, ఆశ్రమాలనీ సత్యభామకి చూపిస్తూ స్వర్గంచేరాడు కృష్ణుడు. అక్కడ దేవేంద్రుడా దంపతులని బాగా గౌరవించాడు. మర్యాదలు చేశాడు. తరువాత సత్యాకృష్ణులు దేవతల తల్లి అదితిని చూసి ఆమెకు నమస్కరించారు. ఆమె వారినెంతో ఆప్యాయంగా చూసి ఆశీర్వదించింది. సత్యభామను ప్రత్యేకంగా కృష్ణుడు మానవావతారంలో ఉన్నంత వరకూ నిత్యయౌవనవతిగా ఉండమని మరీ దీవించింది. తరువాత వారు నందనవనం చూడ్డానికి బయలుదేరారు. కృష్ణుడు సత్యభామకి నందనోద్యానవనమంతా తిప్పి చూపించాడు. పారిజాతవృక్షాన్ని చూపి దాని మహిమలన్నీ వివరించాడు. దానిని చూడగానే సత్యకి ఎంత త్వరగా దానిని తీసుకుపోయి తన పెరట్లో నాటిద్దామా అన్న తొందర పుట్టింది "నాథా! ఇంకా ఆలస్యం

చేస్తావేం. నీ ప్రతిజ్ఞచెల్లేలా దీనిని తొందరగా పెకలించేసెయ్. నా ఉద్యానవనంలో దీన్ని నాటించెయ్యి వెంటనే" అంటూ తొందరపెట్టింది. ఆమె ముచ్చట తీర్చడమే కదా కృష్ణుడి కోరిక! కొంతసేపు ఆ నందనవనంలో హాయిగా విహరించాక పారిజాతవృక్షం దగ్గరకి వచ్చి దానిని తేలికగా పెకలించేశాడు కృష్ణుడు.గరుత్మంతుడి వీపుమీదపెట్టి ద్వారకకి బయలుదేరాడు సత్యతో. అదిచూసి అక్కడ ఆ వనాన్ని కావలాకాసే వారందరూ అతణ్ణి అడ్డగించారు. ఇది మా దేవేంద్రుడు తన భార్య శచీదేవికి బహుమానంగా ఇచ్చిన చెట్టయ్యా! చుట్టంలా వచ్చి దీన్నిలా దొంగతనంగా తీసుకుపోవడమేం మర్యాద? అని అడిగారు.

ఇందులో ఇంద్రుడి పెత్తనమేమిటి?

అప్పుడు సత్యభామ చాలాదర్పంతో "ఈ దివ్యవృక్షం సముద్రంలో పుట్టింది. దీనికి ఇంద్రుడి పెత్తనమేమిటి? ఇంద్రాణి పెత్తనం ఏమిటి? ఇదేమయినా ఒకరిసొమ్మా? ఇదిగో! నా భర్త చేత ఈ చెట్టుపెకలించి తీసుకుపోతున్నాను. మీ శచీదేవి తాను వీరపత్నియైతే ఇంద్రుణ్ని పంపి సత్యభామా

విధేయుడైన కృష్ణుడి దగ్గరనుంచి చెట్టుని తీసుకుపొమ్మనండి; అదీ గొప్ప!" అంది. వీరవనిత, వీరపత్ని, వీరమాత అయిన సత్యభామ యీ మాటలనడం ఎంత ఉచితం. తరువాత ఇంద్రుడొచ్చి కృష్ణుడితో యుద్ధంచేసి ఓడిపోయాడు. కృష్ణుడు సత్యతోనూ పారిజాతంతోనూ ద్వారకకి వచ్చాడు. "నీ వంతం నెరవేరిందికదా! ఇదిగో పారిజాతం! అంటూ సత్యభామకి ఆ వృక్షాన్ని సమర్పించాడు. ఆమె చాలా సంతోషించి కృష్ణుడి మంచితనాన్నీ, గొప్పతనాన్నీ పొగడి తన ఉద్యానవనంలో చల్లగా ఉన్న చెంగల్వకొలను పక్కన ఆ వృక్షాన్ని నాటి దానికి పూజలూ అవీ చేసింది.

ఎంత మంచిదాంపత్యం!

లోకంలో ఎంతోమంది భార్యాభర్తలుంటారు. వాళ్లెంతో ప్రేమతో ఉంటారు. కానీ సత్యాకృష్ణులంత అన్యోన్యంగా ఉన్నవాళ్లనెక్కడా చూడలేదు. ఆమె కోరడమేమిటి? కృష్ణుడు తన అన్న యింద్రుడితోనే యుద్ధంచేసి పారిజాతాన్ని తెచ్చి సత్య కివ్వడమేమిటి? ఎంత మంచి దాంపత్యం వాళ్లది! అని అందరూ మెచ్చుకున్నారు.

**మంచితనానికి మారుపేరు :**

సత్యభామ తనగౌరవమూ గొప్పతనమూ నిలబెట్టుకోవడానికి అప్పుడప్పుడు దర్పంగా ప్రవర్తించినా చాలా మంచిది. తనయింట్లో కృష్ణుడితో కలసి బంధువులందరికీ రుచికరమైన పదార్థాలతో విందులు చేస్తూండేది. అంతఃపురమంతా చక్క పెట్టుకునేది. అత్తమామలకు సేవచేసేది. పెళ్లిళ్లూ పేరంటాలూ జరిగినప్పుడు, రుక్మిణితోనూ తక్కిన సవతులతోనూ కలసి భర్తకి సహాయంచేసేది. ఇంటికి వచ్చినవారిని ఆప్యాయంగా ప్రేమగా గౌరవంగా చూసేది.

కృష్ణుడి చెల్లెలు సుభద్రకి తనబావ అర్జునుణ్ణి పెళ్లిచేసుకోవాలని కోరిక. అర్జునుడుకూడా సుభద్రను వివాహం చేసుకోవాలనుకున్నాడు. ఈ వివాహం కృష్ణుడికిష్టమే కానీ బలరాముడికి ఇష్టం లేదు. ఒకమాటు అర్జునుడు తీర్థయాత్రలు చేస్తూ ద్వారకకి వచ్చాడు. కృష్ణుడతన్ని యతివేషంలో ఒక తోటలో ఉంచాడు. అతను అర్జునుడనీ జాగ్రత్తగా చూసుకోమనీ రుక్మిణీసత్యభామలతోమాత్రం రహస్యంగా చెప్పాడు. సత్యభామ అర్జునుణ్ణి పలకరించి వాళ్లందరి యోగక్షేమాలూ కనుక్కుంది. "అన్నా మేమంతా జ్ఞాపకం ఉన్నామా?" అని

అడిగింది. సుభద్రని అర్జునుడికి సేవలు చేయడానికి నియమిం చాడు కృష్ణుడు. అతనర్జునుడని తెలిశాక సుభద్ర అతనిదగ్గరకి వెళ్లడం మానేసింది. వదినలందరూ ఆమెని వేళాకోళం చేయడం మొదలుపెట్టారు. ఆమె వారెవరేమన్నా సమాధానం చెప్పలేదు. అప్పుడు సత్యభామ "ఏం మరదలా! ఎంత పలక రించినా పలకవేం" అని పాపం, ఈ సుభద్ర కేదో గాలి సోకిందర్రా ఆ సన్యాసికి చూపించి ఏదయినా మంత్రంవేయిం చాలి అంటూ ఆమెని వేళాకోళం చేసింది. కృష్ణుడు సుభ ద్రార్జునుల పెళ్లి రహస్యంగా చేయించాడు. ఆ పెళ్లిలో కృష్ణుడికి రుక్మిణితో కలసి చాలా సహకరించింది సత్య వియ్యాలవారికి చాలా మర్యాదలుచేసి ఎంతో సరసంగా ప్రవ ర్తించింది. సుభద్ర అత్తవారింటికి వెడుతూ నమస్కరించ డానికి వచ్చింది. సత్యభామ తన స్వభావానికి తగినట్లుగా "వీరమాతవి"కమ్మని ఆశీర్వదించింది. పదిమందికొడుకుల తల్లి సత్యభామ.

**ఇంటినిచూసి యిల్లాలినిచూడాలి :**

సత్యభామ సహజంగా చాలా అందమైనది. దానికి తోడు ఎప్పుడూ చక్కగా అలంకరించుకుని కళకళలాడుతూ

రమ్మని పిలిచాడు కృష్ణుడు. తను రుక్మిణితో ఆడుతూన్నప్పుడు సత్యభామ సాక్షిగా ఉండి పందెంచెప్పాలి. తను సత్యభామతో ఆడుతున్నప్పుడు రుక్మిణి సాక్షిగా ఉండి పందెం చెప్పాలి అని చెప్పాడు. సత్యభామ మాట్లాడక ఒప్పుకుండా? "చాల్లే ఆడక ఆడక నీతోనే ఆడాలి. మోసగాడివి దొంగాటలన్నీ ఆడు తూంటావు. నీతో ఎవరు వాదించగలరు? జూదరివి" అంటూ పేచీకి దిగింది. సరే. అయితే జాంబవతిని పిలుస్తానన్నాడు. దానితో ఉడుక్కుని తనే తయారయింది. ముందు రుక్మిణితో ఆడాడు. పాపం అతనే దొంగాట ఆడినా రుక్మిణి సర్దుకుపోయి ఆడింది. ఏమీమాట్లాడలేదు. తరువాత సత్యభామతో ఆడాడు. రుక్మిణిలా ఈమె సరిపెట్టుకోలేదు. ఆటలోనూ పాటలోనూ మాటలోనూ తనదే పైచేయిగా ఉండాలికదా సత్యభామకి? కృష్ణుడేమీ మోసం చెయ్యకుండా జాగ్రత్తగా చూసుకుంటూ చాలామాట్లు తనే ఆటలో గెలిచింది. ఇలాంటి సందర్భాలలో రుక్మిణీ సత్యలు ఒక్కటయ్యేవారు.

ఇదీ పుణ్యకవ్రతం:

ఇలాగ ఆటలతో పాటలతో, విందులతో వినోదాలతో, అలకలతో కులుకులతో రోజులు గడుస్తూండగా నారదుడు

మళ్లీవచ్చాడు సత్యభామ ఇంటికి. కృష్ణుడుకూడా అప్పుడక్కడే ఉన్నాడు. కుశలప్రశ్నలూ అతిథి సత్కారాలు అయ్యాయి. నారదుడు మాట్లాడుతూ సత్యభామతో ఇలాగ అన్నాడు. "అమ్మా! నేను నీకొక వ్రతంచెబుతాను. దాన్ని పార్వతీదేవి శచీదేవి మొదలయిన వారంతా చేస్తూంటే చూశాను. "పుణ్యకవ్రతం" అంటారు దానిని. భర్త అనుమతి తీసుకుని ఆవ్రతం ఆచరించాలి. ప్రొద్దున్నే స్నానంచేసి చక్కగా అలంకరించుకోవాలి. కోపమూ, ఈర్ష్యా, గర్వమూ లేకుండా సవతులనందరినీ వినయంతో ప్రేమతో వ్రతానికి ఆహ్వానించాలి. బంధువుల నందర్నీ పిలవాలి. ముత్తైదువులందరికీ తాంబూలాలివ్వాలి. చైత్రశుద్ధ నవమి మొదలు ఒక్కనెల ఆ వ్రతాన్ని చేయాలి. తరువాత బాగా వేదాలు శాస్త్రాలూ చదువుకున్న బ్రాహ్మడికి దక్షిణలతో నీ భర్తని దానం చేయాలి. తరువాత ఆ బ్రాహ్మడేది కోరితే అది ఇచ్చి నీభర్తని తీసుకోవాలి. ఇదీ వ్రతవిధానం. ఇలా నియమంగా ఆ వ్రతం చేశావంటే నీవూ నీ భర్తా అరమరికలు లేకుండా సుఖంగా ఉంటారు" అని ఉపదేశించాడు. కృష్ణుడికోసం ఏంచేయడానికైనా సిద్ధమే కదా! సత్యభామ. ఇంకేం, సరే నన్నది.

ముల్లోకాలు తరలివచ్చాయి:

వెంటనే సత్యభామ భర్త అనుమతి తీసుకుంది. బంధువుల నందర్నీ పిలిచింది. రుక్మిణినీ తక్కిన సవతులనీ తనే స్వయంగా వెళ్లి ఆహ్వానించింది. అందరికీ అన్నివైపులా ఆహ్వానాలు వెళ్లాయి. ఆ పిలుపుల నందుకొని యదువంశంలోని అన్నితెగలకు చెందిన ఆప్తులు వచ్చారు. రుక్మిణి తండ్రి భీష్మకుడూ, ఇంకా పదహారువేలమంది రాజులూ అంటే వియ్యాలవారందరూ వచ్చి చేరారు. పాండవులూ, కౌరవులూ మొదలయిన బంధువులందరూ వచ్చారు. నందుడూ మొదలైన గోపాలబృందమూ స్నేహితులైన రాజులూ వచ్చారు. మహామునీశ్వరులు వచ్చారు. వాళ్లూ వీళ్లూ అనేమిటి? మూడులోకాలూ అక్కడే ఉన్నాయి. నాలుగుమూలలనుంచీ కావలసిన సరంజామా అంతా వచ్చింది. కృష్ణుడి ఆజ్ఞతో విశ్వకర్మ రైవతకపర్వత ప్రాంతంలో మణిమయమైన దాన మండపాన్ని నిర్మించాడు. ఆకాశమంతా దేవతల విమానాలే. దిక్కులంతటా రాజుల కిరీటకాంతులే. బ్రహ్మాండమంతా మంగళవాద్యఘోషలే. ఇవన్నీ సత్యభామ వైభవాన్నీ ఆమె చేసే వ్రతవిశిష్టతని చాటుతున్నాయి.

భర్త ప్రేమ ఉంటే నగలెందుకు?

కృష్ణుడూ సత్యభామా మంగళస్నానాలు చేశారు. పట్టు వస్త్రాలు కట్టుకున్నారు. రత్నాభరణాలు ధరించారు. సుముహూర్తంలో వ్రతదీక్ష పూనారు. కృష్ణుణ్ణి దానం తీసుకునేందుకు నారదుణ్ణి ఒప్పించారు. అతనికి సకలవిధపూజలు చేశారు. ధౌమ్యుడూ మొదలయిన వారిని పురోహితులనుగా చేశారు. తనవెనుక ప్రద్యుమ్నుడు, సాత్యకి, అభిమన్యుడు మొదలైన వారు వస్తూండగా, ధర్మరాజు మొదలయిన రాజులతో మంగళవాద్యాలతో కృష్ణుడు భద్రగజంమీద దానమండపానికి వచ్చాడు. సత్యభామ కూడా ద్రౌపదీ సుభద్రా వాళ్ళు తనతోరాగా ముత్యాలపల్లకిమీద వచ్చింది. పారిజాతవృక్షానికి ప్రదక్షిణం చేసి నారదుడ్ని పూజించి శాస్త్రోక్తంగా వ్రతం చేసింది. ఇక ఇప్పుడు కృష్ణుణ్ణి దానం చేయాలన్నాడు నారదుడు. సిగ్గుపడిపోయింది సత్యభామ. ప్రేమాభిమానాలతో కృష్ణుడివైపు చూస్తూ "నారదుడి మాట విన్నావా"అని అడిగింది. అతను నవ్వుతూ "సందేహమెందుకు? ఇది శాస్త్రోక్తమే కదా! దానం చేయ"మన్నాడు. అప్పుడతనిని కల్పవృక్షానికి పూలమాలలతో కట్టేసింది. అదిచూసి సత్యభామ

చెలులు వేళాకోళాలు చేస్తూంటే ఇంకొంచెం పురికొల్పారు ధర్మజ భీమార్జునులు. సత్యభామ కృష్ణుడిని పారిజాత వృక్షంతోసహా దానంచేసింది. బంగారపుగిన్నెలతో పారిజాత పుష్పాలని ముత్తైదువులందరికీ పంచిపెట్టింది. బంధువు లందర్నీ చందనతాంబూలాలతోను నూతనవస్త్రాలతోను గౌర వించింది.

నారదుడు కృష్ణుడికి అవనీ ఊపనీ చెప్పి చేయించాడు. తరువాత సత్యభామ తన నగలన్నీ యిచ్చి నారదుడి దగ్గర నుంచి తనభర్తని మళ్లీ తీసేసుకుంది. ఔను మరి భర్త ప్రేమ ఉంటే ఇక నగలెందుకు? భర్త ప్రేమే లేకపోతే యిక నగలతో పనేమిటి?

ఈ వ్రతవైభవాన్ని చూచి దేవతలు మెచ్చుకొని పుష్పవర్షం కురిపించారు. ఈ రకంగా సత్యభామ కృష్ణుణ్ని పూర్తిగా తనవానిగా చేసుకుంది.

సత్యభామ కథ పురాణాలలోనే కాక, రంగస్థలనాటకాల లోనూ, కూచిపూడి నాట్యాలలోనూ, జానపద గేయాలలోనూ కూడా ఒక ప్రత్యేకతను పొందింది. పుణ్యకవ్రతకథనే మన

తెలుగుదేశంలో "కృష్ణతులాభారం" అనే పేరుతో రంగస్థల నాటకంగా ప్రదర్శిస్తుంటారు. అందులో కథ ఇలా ఉంది.

**భక్తితోనే భగవంతుని పొందాలి :**

సత్యభామ గర్వంతో విర్రవీగుతూ ఉంటుంది. అందరినీ ముఖ్యంగా సవతులను చులకనగా చూస్తుంటుంది. నారదుడు పుణ్యకవ్రతం చేస్తే భర్త పూర్తిగా స్వాధీనుడవుతాడని చెప్తాడు. వ్రతం ఎల్లా చేయాలో చెప్తాడు. అప్పుడు సత్యభామ సంతోషంతో పొంగిపోతుంది. భర్త పూర్తిగా తనకి లోబడి ఉండే మార్గం దొరికింది కదా అని గర్వంతో-

"మీరజాలగలడా నా యానతి వ్రతవిధానమహిమన్ సత్యాపతి
నటనసూత్రధారి మురారి ఎటులదాటగలడో నా యానతి
వ్రతవిదానమహిమన్
సుధాప్రణయజలధిన్ వైదర్భికి ఈదతావుగలదే నాతోనిక
వాదులాడగలదే"

అని పాడుకుంటూ ఉప్పొంగిపోతుంది.

అంటే నేనుచేసే వ్రతమహిమతో కృష్ణుడిక నా ఆజ్ఞ మీరగలడా? కృష్ణుడి ప్రేమలో రుక్మిణికింక చోటేదీ? అని

పొడుకుంటుందన్న మాట. నారదుడు చెప్పినట్లు సత్యభామ వ్రతం చేస్తుంది. కృష్ణుణ్ణి నారదునికి దానం చేస్తుంది. నారదుడు కృష్ణుడిచేత చాలా పనులు చేయిస్తాడు. కృష్ణు డెప్పుడూ అలాటిపనులు చేసినవాడుకాడు. కనుక బిక్క ముఖం వేసి తనను తొందరగా విడిపించమని కోరుతాడు సత్యభామని. సత్యభామ అతనిని తిరిగి తీసుకోవడానికి తన నగలన్నీ ఇస్తుంది. కృష్ణుణ్ణి త్రాసులో ఒకవైపు ఉంచి రెండోవేపు తన నగలన్నీ వేస్తుంది. త్రాసు కదలదు. ఇంటిలోవున్న ఆభర ణాలూ బంగారమంతా వేసేస్తుంది. ఊహూ! లాభముండదు. తన సమస్త సంపదనీ త్రాసులో పెట్టేస్తుంది సత్య. త్రాసు ఒక్కపిసరుకూడా కదలదు. సత్యకి భయం వేస్తుంది, ముని కృష్ణుణ్ణి తనకివ్వడేమో అని. అప్పుడు కృష్ణుడి కోసం ఏం చేయడానికైనా సిద్ధంగా ఉంటుంది సత్య. అప్పుడెవరో చెప్తారు రుక్మిణీదేవిని తీసుకురమ్మని. తన ఆత్మాభిమానం గర్వం అంతా విడిచిపెట్టి రుక్మిణిదగ్గరకు పరుగెడ్తుంది సత్య. బతిమాలి రుక్మిణిని తీసుకువస్తుంది. రుక్మిణి వచ్చి భక్తితో ఒక్క తులసీదళం వేస్తుంది నగలన్నీ తీయించేసి. వెంటనే త్రాసు కృష్ణుడున్న వేపూ, రెండోవేపూ సమానంగా తూగు

తుంది. దానితో సత్యగర్వం అణగుతుంది. భక్తితో భగవంతుణ్ణి అంటే కృష్ణుణ్ణి లొంగతీసుకోగలం కానీ ధన ధాన్యాలతోనూ సిరిసంపదలతోనూ అధికారంతోనూ కాదని తెలుసుకుంటుంది సత్య. సత్యభామకి చాలా గర్వం అని కదా ప్రసిద్ధి. నారదుడు ఆమె గర్వాన్ని ఇలా తగ్గించి ఆమెకి జ్ఞానోదయం కలుగచేశాడని భావం.

**భామాకలాపం :**

తెలుగుదేశంలో కూచిపూడినాట్యం చాలా ప్రసిద్ధమైనది. అందులో భామాకలాపానికి ఒకప్రత్యేకత ఉంది. కూచిపూడిలో పుట్టిన ప్రతిబ్రాహ్మణబాలుడూ ముక్కులు కుట్టించుకుని తన జీవితంలో ఒక్కమాటైనా భామవేషంకట్టాలని శ్రీసిద్ధేంద్ర యోగులవారాజ్ఞాపించారట. భామాకలాపం అంటే సత్యభామ కథే. దాంట్లోకూడా సత్యభామ అతిశయమూ, కృష్ణుడికోసం పడే తహతహ వర్ణిస్తారు.

భామనే సత్యభామనే
పదియారువేల కోమలు లందరిలోన
రామరో! గోపాలమూర్తికి ప్రియురాలైన సత్యభామనే॥

కూరిమి సత్రాజిత్తు కూతురై ఇందరిలోన
గోపాలదేవుని బాసి తాళజాలక యున్నట్టి భామనే
॥ సత్య ॥

అట్టహాసముచేసి సురలను ఇట్టె గెలిచీ పారిజాతము
చెట్టుతెచ్చీ నాదు పెరడున గట్టిగా నాటించుకొన్న
॥ భామనే ॥

ఈ పాటలో సత్యభామ వయ్యారమూ, గడుసుతనమూ, అధికారమూ, కృష్ణునిమీదున్న అనురాగం అన్నీ తెలుస్తున్నాయి.

జానపదసాహిత్యంలో. సత్యభామ :

జానపదగేయాలని మరోరకం పాటలున్నాయి. చదువుకోనివారూ, ఒకపద్ధతిలో సంగీతం నేర్చుకోనివారూ తమ ఆనందంకోసం తాముపాడుకునే పాటలివి. ఆపాటలలో కూడా సత్యభామకొక విశిష్టస్థానం ఉంది. "సత్యభామ సరసము" "పారిజాత పల్లవి" "తులసీదళం" అంటారు ఈ పాటలను. "సత్యభామసరసం"లో తలుపులదగ్గర సత్యాకృష్ణుల సంవాదం బాగుంటుంది. తలుపవతల నిలబడి కృష్ణుడు తలుపుతీయమంటాడు. మాటకి మాట సమాధానంచెప్తూ ఎంతకీ తలుపు

తీయదు సత్య. ఆఖరికి తలుపుతీసి రుక్మిణి యింటికి వెళ్లి వచ్చాడు కృష్ణుడని తెలుసుకుంటుంది. వెంటనే ఈర్ష్యతో-

"రుక్మిణీసతి నీకు పట్టంపుదేవి
యెంతబలువైతినో నాతండ్రికపుడు
చిన్ననాడె విషంపోసి చంపడాయెనుగ
అంతకన్న నూత పడవెయ్యడాయె
ఇందరు సవతుల మీద వెదకి తెచ్చి నన్ను
నీమెడను గట్టితా అరషపడినాడు"

అని భోరుమని ఏడుస్తుంది.

రుక్మిణీదేవి నీపట్టపుదేవి. ఆమె మీదే నీకుప్రేమ. నాతండ్రికి నేను బరువయ్యాను. ఇంత విషమిచ్చో, నూతిలో పడవేసో చంపితే తీరిపోను. అని ఏడ్చిందన్నమాట. కృష్ణుడు విసుగొచ్చి వెళ్లిపోబోతాడు. వెళ్లబోయే కృష్ణుణ్ణి ఆపి భామ!

"అపుడు సత్రాజిత్తు పంపేటినాడు
ఆడపడుచుల బుద్ధి ఏమనిచెప్పె
ఏమని చెబుతుంటె వినశక్యమాయె
మమ్ము శిక్షింపుమని విన్నపములాయె"

అని జ్ఞాపకం చేస్తుంది. తండ్రి తనని అత్తవారింటికి పంపే టప్పుడు. తప్పుచేస్తే కృష్ణుణ్ణి శిక్షించమని చెప్పాడట. అయితే శిక్షించమని కృష్ణుడు బంగారపు బెత్తం ఇస్తాడు. ఆ బెత్తం అవతల పారవేసి ఎక్కువతక్కువ మాటలేమన్నానో మన్నించ మని కృష్ణుడిపాదాలు ఒత్తిందట. క్షణంలో అసూయ, క్షణంలో కోపం, క్షణంలో అనురాగం చూపే యీ సత్యభామ గారాలుపోతూ ఎంతోముచ్చటగా కనిపిస్తుంది.

"పారిజాత వల్లవి"లో పారిజాతపు పువ్వుకోసం అలిగిన సత్యని—

" మొగమాటమ్మున ఇచ్చితిగానీ
మోహమ్మున గాదే
యింకను చక్కని పారిజాతం కొనితెత్తును
నీసరసవనంలో మక్కువతో నాటింతు "

అని ఓదారుస్తాడు కృష్ణుడు. "రుక్మిణికి పువ్వు మొహమాటంతో ఇచ్చానుకానీ ప్రేమతోకాదు. నీకు పారిజాతవృక్షాన్నే తెస్తాను నీసరసవనంలో నాటిస్తాను" అని సంతోషపెడ్తాడు.

"రుక్మిణీదేవి సీమంతం" అని యింకోపాట ఉంది. రుక్మిణీదేవికి సీమంతం చేయాలనుకుంటారు దేవకీ వసుదేవులు. కృష్ణుడు వారికి కనబడి అప్పటికే చాలా రోజులయింది. అతణ్ణి వెతికి వెతికి సత్యభామ అంతఃపురంలో చూచారు పరిజనులు. సత్యభామ యెదుట అతన్ని పిలవడానికిభయం. అందుకని చాటునుంచి కనుసంజ్ఞలుచేశారు. అక్కడనుంచి ఇవతలికి రావడానికి కృష్ణుడికీ భయమే. అందుకని సత్యభామతో-

"భామామణిరో! సత్యభామామణిరో
వినవే మనభక్తుడు అక్రూరుడు
మనకు విందు అమరించ వచ్చెనే"

అని అబద్ధం చెప్పాడు. సత్యభామ పంపుతుందతన్ని. సరే! రుక్మిణీదేవి సీమంతం జరిగింది. ఆ ఉత్సవానికి సత్యభామ తప్ప పదహారువేలమంది గోపికలూ, తక్కిన కృష్ణుడిభార్యలూ అంతా వచ్చారు. పాపం రుక్మిణి, సత్యభామ అలిగి రాలేదని తెలుసు. తన పచ్చలపతకం కృష్ణుడిచేతికిచ్చి సత్యభామ అలక తీర్చమంటుంది. అప్పుడుకృష్ణుడు.

" పాషాణము అసత్యభామకోపమూ
భామకు అలకలు తీర్చుతరమేకాదూ "

"సత్యభామ కోపంచాలా గట్టిది. ఆకోపం తీర్చడం మనతరం కాదు" అని ఇక తప్పదు కనుక సత్యభామ దగ్గరికి వెళ్లి పచ్చలపతకం ఇచ్చి ఆమెకోపం పోగొట్టి రుక్మిణికి కొడుకు పుట్టేదాకా అక్కడేఉండి బారసాలకి వస్తాడు మళ్లీ రుక్మిణి అంతఃపురానికి. ఇలాగ ఈర్ష్యాకషాయితగా వర్ణిస్తారు సత్యభామ నిందులో—

సాటిలేని పతివ్రత :

ఒక్కవిషయం గమనిస్తే సత్యభామ ప్రవర్తనకీ స్వభావానికీ అర్థం తెలుస్తుంది. సత్యభామ పూర్వజన్మనుంచే వ్రతాలూ పూజలూచేసి కృష్ణుణ్ణి భర్తగా పొందింది. భక్తితో కృష్ణుణ్ణి కొనుక్కుందన్నమాట సత్యభామ. అందుకే అతని మీద అంత అధికారమూ, హక్కూ చూపించేది. అతనింకెక్కడి కయినా వెళ్తే తనవస్తువెవరో లాక్కుపోయినట్లు గిలగిల లాడేది. అందుకే ఆమెకు తనుచూపించే అధికారమూ అవీ చాలాన్యాయంగా తోచేవి. తను కష్టపడి సంపాదించుకొన్న

వస్తువునే కదా! తను కోరుకుంటూంది? అతడు పూర్తిగా తనవాడే కావాలని కోరుకోడం ఈ అధికారంతోనే. నిజానికి సత్యభామకంటే పతివ్రతలింకెవ్వరూ లేరు.

తపోవనగమనం:

కృష్ణుడు మానవావతారం ఎత్తాడుకనుక, ఈ అవతారంలో తనుచేయవలసిన పనులయిపోగానే మనుష్యులందరిలాగే అతనూ మరణించాడు, అంటే అవతారం చాలించాడన్న మాట. అతని భార్యలందరూ అతనితో సహగమనం చేశారు. సత్యభామమాత్రం తపస్సు చేసుకోడానికి తపోవనాలకి వెళ్లిపోయింది.

సత్యభామే ఆండాళ్‌గా జన్మించింది:

సత్యభామ తరువాతి జన్మలో గోదాదేవిగా పుట్టుంది. శ్రీవిల్లిపుత్తూరులో విష్ణుచిత్తుడనే భక్తుడుంటాడు. అతనికి తులసివనంలో ఒక బాలిక దొరికింది. ఆమెకి గోదాదేవి అని పేరుపెట్టి విష్ణుచిత్తుడూ అతనిభార్యా అల్లారుముద్దుగా పెంచుకుంటారు. ఆమెపెద్దదై యుక్తవయస్కురాలవుతుంది. పూర్వజన్మసంస్కారంవలన విష్ణుభక్తురాలై శ్రీకృష్ణుణ్ణే తలచుకుంటూ

అతని వియోగానికి బాధపడుతూంటుంది. గోపికాకృష్ణుల విహారాలని తలుచుకుంటూ తన చెలులని "మనం గోపికా కృష్ణులున్నప్పుడుంటే ఎలాగుండేది" అని అడిగిందొకసారి. వాళ్లు నవ్వుతూ "నువ్వప్పుడుండక ఏమయ్యావు. రుక్మిణికి పారిజాతపుష్పాన్నిచ్చినందుకు నానాహంగామాచేసి ఏకంగా చెట్టే తెప్పించుకున్న సత్యవుకావా నువ్వు?" అన్నారు.

అదివినగానే ఆమెకి పూర్వజన్మస్మృతి కలిగింది. పూర్వ జన్మలో కృష్ణుడితో కలసి అనుభవించిన సుఖాలన్నీ జ్ఞాపకం వచ్చాయి. శరీరం పులకరించి సొలిపోయింది. చెలులు "ఎందుకు చెప్పామా" అని కంగారుపడి ఉపచారాలు చేశారు. అప్పుడు తేరుకుని ఆమె "పూర్వజన్మలో కృష్ణునికి ప్రియురాలినై ఉండి ఈ కలియుగంలో మళ్లీ ఇలా పుట్టి విరహంతో బాధపడుతున్నాను. ఈశరీరమెందుకు? నా తండ్రి నన్నింకొకరికిచ్చి వివాహంచేయకముందే యోగశక్తితో శరీరాన్ని విడిచిపెట్టి మళ్లీ ఆ కృష్ణుణ్ణే పొందుతాను" అనుకుంది. అదివిని ఆమెచెలులు "ఆకృష్ణుడెక్కడోలేడు రంగనాథుడనే పేరుతో ఇక్కడే శ్రీరంగంలో ఉన్నాడు. తొందరెందుకు? అతడే నీభర్త కావడానికి మన ఊరిలో ఉన్న హరిని సేవించు"

అన్నారు. గోదాదేవి వారుచెప్పినట్లుగానే హరిని సేవించి, తనమనస్సు తెలిసి తన తండ్రి శాస్త్రోక్తంగా రంగనాథుడి కిచ్చి పెళ్లిచేయగా అతనిభార్య అయింది. ఈమె తనతండ్రి విష్ణువుకోసం కట్టి ఉంచిన పూలమాలలను తాను పెట్టుకుని నూతిలో తనఅందం చూచుకుని మళ్లీ పెట్టేసేది. ఆ పూలే భగవంతుడికి ఎక్కువ యిష్టంగా ఉండేవట. తను పూలు పెట్టుకుని మళ్లీ తీసియిచ్చేది కనుక ఈమెకి "ఆముక్త మాల్యద" అనికూడా పేరువచ్చింది. ఈమెనే "ఆండాళ్" అనికూడా అంటారు.

భూదేవే సత్యభామ అని కూడా అంటారు. ఇలాగా సత్యభామ జన్మజన్మాలకీ కృష్ణుణ్ణే భర్తగా కోరి పొందిన పుణ్యాత్మురాలు.

సత్యభామ చరితం స్త్రీజాతికే గర్వకారణం.

సత్యాకృష్ణుల ప్రణయం అపూర్వం మధురాతిమధురం.

సత్యాకృష్ణుల సరసజీవనం మంచి దాంపత్యానికి నిదర్శనం.

* * *

